ఆదిశంకరుల

# అపరోక్షానుభూతి

## "బ్రహ్మవిద్యా విధానము"





భావానువాదం


భాగవతి రామమోహనరావు





ప్రకాశకులు

జ్ఞాన వికాస్ పబ్లికేషన్స్

210-8 ఆర్ టి. విజయనగర్ కాలనీ, హైదరాబాదు

1994

# ప్రకాశకుల ఆకాంక్ష

ఉత్తమ ఆధ్యాత్మిక సాధకుల ఉపయోగార్థం, ఉత్కృష్టమైన ఈ గ్రంథం ప్రచురింపబడింది

ఈ గ్రంథంలో మొదట సాధకుల ప్రథమ యోగ్యతలు వివరించి, ఆత్మజ్ఞానప్రాప్తి కోసం లక్ష్యసిద్ధియైన పరమాత్మ స్వరూపచింతన యే విధంగా కొనసాగించవలెనో, శరీర, ప్రపంచాదుల యొక్క మిథ్యత్వాన్ని ఎలా గ్రహించి, నిర్ధారణ చేసుకొనవలెనో, దేహాత్మభావాన్ని, ప్రపంచ భ్రాంతినీ పోగొట్టుకొనేవిధానమేదో క్రమంగా వివరింపబడినాయి ఆత్మజ్ఞానం పూర్తిగా సిద్ధించడానికి పదిహేను అంశాలతో కూడిన తత్వవిచార సాధనాక్రమం, 101వ శ్లోకం మొదలుకొని బోధించబడింది జ్ఞానంతో కూడిన ఈ అంశాలను అవగాహన చేసుకుని, ప్రతినిత్యము అనుష్ఠానం చేసుకుంటే తప్పక ఆత్మానుభూతికి తోడ్పడగలదని ప్రకాశకుల ఆకాంక్ష.

జ్ఞానంతో చేసే అనుష్ఠానమే ఉత్తమమైన ఆధ్యాత్మికసాధన అవుతుందని, జ్ఞానంలేని అనుష్ఠానం అధమమని, జ్ఞానం పొంది అనుష్ఠానం లేకపోవడం మధ్యమమని వేదాంతశాస్త్రాల్లో సూచింప

బడింది. ఇక్కడ జ్ఞానమంటే వేదాంత శాస్త్ర జ్ఞానమని అర్థం. ముందు శాస్త్రజ్ఞానం వల్ల వివేకంతో తత్వనిర్ధారణ చేసుకుని, యదార్థమైన భగవత్తత్వాన్ని గ్రహించుకున్న అనంతరం, శాస్త్రోక్తంగా, సక్రమంగా ఆధ్యాత్మిక అనుష్ఠానానికి ఉపక్రమించడం ఉత్తమ సాధనగా సూచింపబడింది. వేదాంతశాస్త్ర పఠనం, మననం చేసి, సాధనావిధానాన్ని గ్రహించికూడా, సాధనకి ఉపక్రమించకపోవడం మధ్యమ అనుష్ఠానమని, వేదాంత శాస్త్రజ్ఞానం ఏ మాత్రమూ లేక, ఆత్మతత్వం ఎంతమాత్రమూ తెలుసుకొనక, అవివేకంతో, మూఢ నమ్మకములతో వివిధ బాహ్యక్రియా కలాపములు చేయటం అధమ అనుష్ఠానమని వ్యక్తం చెయ్యబడింది.

విద్యాబుద్ధులు కలిగిన సంస్కారవరులంతా ఉత్తమ అనుష్ఠానాన్ని ఆచరిస్తే ఆధ్యాత్మిక వికాసాన్ని తప్పక పొందగలరని శాస్త్రాలు స్పష్టం చేస్తున్నాయి.

సక్రమ సాధనానుష్ఠానం ద్వారా మోక్షపథాన్ని సాధించడానికి ఆత్మ జిజ్ఞాసులకు, ముముక్షువులైన ఆధ్యాత్మిక సాధకులకు ఈ గ్రంథం తోడ్పడగలదని ప్రకాశకుల ఆకాంక్ష.

హైదరాబాదు

ఇట్లు
ప్రకాశకులు

# ఉపోద్ఘాతము

ఉత్తమ ఆధ్యాత్మిక సాధకులకు అంతిమలక్ష్యం ఆత్మానుభూతి. ఆత్మ బయట నుండి మనకు సంప్రాప్తించునది కాదు. అది అంతర్గతముగా మనము పొందు జ్ఞానవికాసమే. మనో, బుద్ధీంద్రియాల వేటి వల్లా,ఆత్మ తెలుసుకోబడేదికాదు. అది వాటికి అతీతం, అపరోక్షం అవడంచేత, ఆత్మానుభూతిని 'అపరోక్షానుభూతి'గా పేర్కొని, ఈ పవిత్ర గ్రంథాన్ని శంకర భగవత్పాదులు, ఆత్మజిజ్ఞాసులైన సాధకుల కోసం ప్రసాదించారు.

ఆత్మ నిరాకార, నిరతిశయానంద చైతన్య స్వరూపము. దానినే దేముడని, భగవంతుడని పలు విధ నామములతో పేర్కొంటున్నారు. సమస్త ప్రపంచమూ ఆత్మ చైతన్య స్వరూపమే. వేదాంత శాస్త్రిలలో దానిని బ్రహ్మం అని పేర్కొంటూ వివరించారు. బ్రహ్మం ఉన్నది అని తెలుసుకోడం పరోక్ష జ్ఞానం. ఆ బ్రహ్మాన్ని నేనే అయివున్నాను

(అహం బ్రహ్మాస్మి) అని అనుభవంతో అవగాహన కలగడం అపరోక్షజ్ఞానం, లేక స్వరూప జ్ఞానం. ఈ స్వరూప జ్ఞానం సంప్రాప్తించడానికి సంపూర్ణమైన సాధనా క్రమాన్ని ఈ గ్రంథంలో శంకరులు ప్రసాదించారు. అందుచేత ఈ గ్రంథానికి బ్రహ్మ విద్యా విధానమని కూడా పేరు పెట్టబడింది.

తన శరీరము తా నెంతమాత్రము కాదని, సాధకుడు వివేక, వైరాగ్యాలతో నిర్ధారణ చేసుకొనుచూ, తానెవరో, తన నిజస్వరూపం ఏదో అన్వేషించుకొనుటకు తోడ్పడేసాధనానుష్ఠానమే బ్రహ్మ విద్యావిధానము. ఆత్మజ్ఞాన ప్రతిపాదకమగు విద్యకనుక, ఈ బ్రహ్మవిద్య విద్యలలోకెల్లా అతి ప్రధానమైనది.

అపరోక్షానుభూతి అనే ఆత్మానుభవం ఏ సాధన వల్ల, సులువుగా, సత్వరంగా సిద్ధిస్తుందో, ఈ గ్రంథంలో వివరించిన అంశాలవల్ల అవగాహన అవుతుంది. లక్ష్య సిద్ధికోసం ప్రయోజనకరమైన సాధన చేపట్టవలసి ఉంటుంది కదా ! తానీ నామరూపాలతో నున్న దేహాన్ని అనుకునే దేహభ్రాంతీ, తాను, ఇత

రులు, అనుకునే భేదబుద్ధి ఉన్నంతవరకూ, సాధకుడు ఏమీ ఉన్నత స్థితి సాధించనట్లే. తానీ శరీరమనుకునే దేహభ్రాంతి క్రమక్రమంగా క్షీణిస్తోంటేనే కాని, సాధనలో తానేమీ ప్రగతి సాధించడంలేదని సాధకుడు తెలుసుకోవాలి. తాను, ఇతరులు, ఇతరాలు అనే బేధభావం, తానీ దేహాన్ననుకునే దేహాత్మ భావంతో ముడిపడివుంటుంది.

ఉన్నది పరమాత్మ స్వరూపమొక్కటే. ఆంతర్యంలో సంకల్పాలుచేసే మనస్సనబడేది, బాహ్యంగా అనేక దృశ్యాకారాలతో ప్రపంచంగా భాసించేది, కొంతసేపు స్వప్నానుభవంతో గడిపేది, నిశ్చలంగా నిద్రలో నిమగ్నమైవుండేది ఆపరమాత్మ స్వరూపమే. అదొక్కటే తప్ప, ఇతరమంతా యదార్థంగా లేనటువంటి భ్రాంతి స్వరూపమే. ఈ పరమార్థ సత్యాన్ని అవగాహన చేసుకుని, ఆత్మానుభూతి (అపరోక్షానుభూతి) పొందడమే సాధన లక్ష్యం.

సాధనలో కదలికయే సాధకుని శత్రువు. నిలకడయే మిత్రుడు. కదలిక అంటే చలనం. అది

పాంచభౌతిక శారీరక చలనంకాదు. అజ్ఞానంతో ముడి పడివున్న సూక్ష్మ శరీర సంబంధితమైనది. దానివల్లనే దేహ ప్రపంచాదుల స్మృతి, ఆత్మ యొక్క విస్మృతి తటస్థపడటం. హృదయంలో చలనం కలిగినంతనే, అహంకారంగా, మనస్సుగా, దేహ దృశ్య ప్రపంచా కారాలుగా నిశ్చలమైన ఆత్మస్వరూపుడు భాసిస్తు న్నాడు. ఈ చలనం చలనంవల్ల కలిగే ఈ వికారాలు, దృశ్యాలు అన్నీ వాస్తవంగా కల్లలే. యదార్థాలు కావు. చలనంవల్ల అహంకార భ్రాంతి, అహంకార భ్రాంతివలన దేహాత్మబుద్ధి, అంటే, తానొక శరీరుణ్ణను కునే భ్రాంతి; తరువాత జీవత్వంతో కూడిన సర్వ సాంసారిక దృశ్య విషయ అనర్థముల భ్రాంతి. జ్ఞాన యుక్తమైన సాధన ద్వారా నిశ్చలతను అలవరుచు కొనడంతో,ఇవన్నీ విలయమై తనలోనే లీనమౌతాయి. దేవాలయంలోని విగ్రహం ఎలా ఉంటుందో అలాంటి దృఢమైన నిశ్చలత్వం అలవరచుకోవాలి. నిరంతర ధ్యానాభ్యాసం వల్లా, వైరాగ్యం వలనా, అది సంభ విస్తుంది. హృదయంలో ఎప్పుడు అలాంటి నిలకడ ఏర్పడుతుందో—అప్పుడు, దేహాత్మ బుద్ధీ, సర్వ దృశ్య

భ్రాంతులూ విలయమై, అవేవీ నిజంగా లేని మిథ్యా స్వరూపాలు, మాయా స్వరూపాలు తప్ప, యదార్థాలు కావని తేటతెల్లమౌతుంది. జగత్తను పేరు గల దృశ్యము యొక్క మిథ్యాత్వ నిశ్చయమే పరమాత్మ తత్వము. మిథ్యాస్వరూపాలకంతటికీ, చలనం, లేక కదలికయే ఆశ్రయం.మూలకారణం. సాధనలో నిశ్చలత్వం పొందజాలక పరితపించే ఉత్తమ సాధకులకి ఇదంతా అనుభవైక వేద్యమే.

తానెప్పుడూ యదార్థంగా నిశ్చలుడే. తనలో సతతమూ 'నేనునేన'ని భాసించే తాను నిత్య, నిశ్చల, సత్యాత్మ స్వరూప చైతన్యము. ఉన్నది, ఉంటున్నది, ఎప్పుడూ ఉండేది అదొక్కటే అదితప్ప వేరేదీలేనిదే.

ఇక చంచలత్వంతో కూడిన మిథ్యా స్వరూపాలన్నీ కూడా తానే అవుతాడు. అవి తనకి భిన్నంగా ఎక్కడుండగలవు? తనకి గోచరించే, తాను అనుభవించే, చంచలతత్వంతో కూడిన స్వప్న జాతమంతా తానే కదా! స్వప్న కాలంలో మాత్రం అదంతా తనకి అన్యంగా, యధార్థంగా, చంచలంగా ఉన్నట్లు గోచరిస్తుంది. తానవన్నీ, యదార్థంగా నమ్ముతూ అనుభ

విస్తున్నాడు. స్వప్నానంతరం అదంతా మాయమై తానే మిగిలి ఉంటున్నాడు. అలాగే మెలకువ అన బడే జాగ్రదావస్థలో తనకన్యంగా తన అహంకారము, శరీరము, ప్రపంచము అనేక అనుభవాలతో ఉన్నట్లు భాసించడం, తనకు నిద్ర అనే మరొక అవస్థ సంప్రా ప్తించిన తక్షణం అవన్నీ మాయమై, తానే మిగిలి ఉండడం అందరికీ నిత్యానుభవమే. ఇక సుషుప్తి అని పేర్కొనబడే నిద్రావస్థలో ఏ చలనభ్రాంతులూ లేక, తమోమయ స్వరూపుడై తానే ఉంటున్నాడు. ఈ రీతిగా, త్రివిధావస్థల్లోనూ తానుంటూ, ఆ అవస్థలు కేవలం మిథ్యాస్వరూపాలు, అబద్ధమైనవీ అవడంచేత, అవికూడా తానే అయివుంటునాడు. అవి తనకంటే భిన్నమైనవికావు. అందుకే నిశ్చలము, చంచలము ఒకటే అని అవగాహన చేసుకోవాలి. నిశ్చలమే తన నిజస్వభావమని, చంచలమే తన మాయాస్వరూప మని సాధకుడు గ్రహించుకోగలగాలి. సామాన్య సాధకులకు ఇది అవగాహన అవడం, వారి తత్వ గ్రాహ్య సామర్థ్యంపైన ఆధారపడి ఉంటుంది.

సాధకుడు తన యదార్థ స్థితిలో ఇపుడు తానులేడని సులువుగా గమనించ గలడు. తన యదార్థస్థానమైన హృదయస్థలినుంచి కదలి పోయి ఎక్కడెక్కడో సంచరిస్తున్నాడు. ఇలా సంచారంచేసే తననే తాను ఆదొక మనస్సనేదిగా, తనకన్యమైన దానినిగా అన్వయించుకుంటూ, భావిం చుకుంటున్నాడు. ఇది అత్యంత ఆశ్చర్యకరమైన భావన. తనకన్యంగా, తనలో తన మన్సనేది ఇంకొ కటున్నదనుకొనడం ఎంత హాశ్యాస్పదం!

తనసహజ, స్వభావ, స్వరూపస్థితిలో తాను లేకపోవడమే ఈ మెలకువ అనబడే జాగ్రత్తు. స్వప్నం అనబడేదికూడా, కొద్ది తేడాతో ఉన్నట్లున్నా అదీ అలాటిదే. సుషుప్తి అనబడే నిద్రలో తన సహజ స్థితిలో నిలకడగా కొద్దిసేపు తానున్నా, అది తమ స్సనే ముసుగుతో కప్పబడివుండి, తాను మరుగయే ఉన్నాడు. ఇలా, తన సహజ, స్వభావ, స్వరూపమైన పరమాత్మ చైతన్యానుభావాన్ని తాను కోల్పోయి నాడు. ఈ విధంగా తన యదార్థ స్వరూపాను భావాన్ని తాను కోల్పోయివుండటం అనాదిగా

జీవత్వమని పేర్కొనబడింది. జీవత్వం ఆవహించిన వారే జీవులనబడతున్నారు.

మెలకువ అనుకూంటూ నిదురించిన తరువాత లేవడం నిజమైన మెలకువకాదని తెలుసుకోడం వివేక లక్షణం. నిజమైన మెలకువ తానీ దేహాన్నను కునే అహంకార పరమైన అజ్ఞానం నుంచి తన స్వరూప స్థితిలోకిని రావడము. ఆ మెలకువ వివేకవైరాగ్యాది సాధన సంపత్తితో తత్వ విచారం కొనసాగిస్తే సం ప్రాప్తిస్తుంది. తత్వం అంటే తత్ = అది, త్వం = నీవే అని. దేనినైతే తాను సాధించవలెనని ప్రయత్నంతో వున్నాడో అది తానే అయివున్నాడు. కనుక, ఉత్తమ ఆధ్యాత్మిక సాధకుడికి తన సాధనలో అతి ప్రధాన మైనదీ, సాధన లక్ష్యమైనదీ తానే. తానంటే ఆత్మస్వ రూపము. సాధించుటకు భగవంతుడు తనకి (ఆత్మకి) అన్యుడుకాడని, సాధకుడు తొలుదొల్త నిర్ధారణ చేసుకోవడం అవసరం. నిరాకార, అపరిచ్ఛిన్న స్వరూపుడై, తనకన్యంగాలేని ఆ భగవత్ స్వరూపుని, తన కన్యునిగా, ఆకారునిగా భావించడానికి వివేకశూన్యమే కారణం. యదార్థంగా తన కన్యమైనవన్నీ, తన

శరీరంతో సహా, అప్రధానమైన. అనిత్యమైన అనాత్మ పదార్థాలు. అవన్నీ ఉనికి, విలువ లేనివి, స్వప్న దృశ్యాలకు, స్వప్నానుభవాలకు ఏమి ఉనికి, విలువ ఉంటుంది? అటువంటివే జాగ్రదవస్థలో మానవుని మనుగడకు సంబంధించిన శరీర జగత్తులు. వాటి నుండి విడుదల పొందడమే ముక్తి అనబడుతుంది. ఏ సాధన ఆచరించినా దాని కొరకే. సాధించడానికీ, పొందడానికీ సాధకుడికి భిన్నమైనదేదీ లేదు. దేహాతీత, లోకాతీతమై, అభౌతికమై, అన్నిటికీ ఆధారంగా వుండే ఆ భగవత్ స్వరూపమే తన యదార్థ స్వరూపం. దానినే ఆత్మ అని పేర్కొంటారు.

ఆత్మ ఎల్లప్పుడూ ఉంటూన్న సత్య స్వరూపము. తత్వవిచార సాధనవల్ల విషయ ప్రపంచం పూర్తిగా విలయమైతే, ఇక మిగిలేది ఆత్మయే, జ్ఞాన దీప్తిచే స్వప్రకాశమానమై వెలుగుతూండేది.

'యత్రనాన్యత్ పశ్యతి, నాన్యత్ శ్రుణోతి
నాన్యత్ విజానాతి, తద్ భూమా'

అని ఉపనిషత్తులలో ఆత్మస్థితి వివరింపబడింది. అంటే, ఎచట ఎవరూ తమకన్యంగా దేనినీ చూడరో,

వేరేదీ వినరో, ఇతరమేమీ ఎరుగరో ఆ పరమ మౌన స్థితియే ఆత్మ. అది అనిర్వచనీయము, నిర్వికారము. ఆకాశతుల్యము. అదొక్కటే ఉన్నదని, వేరంతా మిథ్యయని, అదే తమయదార్థ స్థితియని, అవగాహన చేసుకుని దాని అనుభూతి పొందటమే అపరోక్ష జ్ఞానము. లేక అపరోక్షానుభూతి.

ఈ సందర్భములో వివేక చూడామణిలో శిష్యుణ్ణి జగద్గురువులు ఏ రీతిగా ప్రభావితుణ్ణి చేశారో గమనార్హం :

అజ్ఞాన యోగాత్పరమాత్మన స్తవ
హ్యనాత్మబన్ధ స్తత ఏవ సంసృతిః।
తయోర్వివేకో దితబోధవహ్ని
ర జ్ఞాన కార్యం ప్రదహేత్సమూలమ్ ॥

తా॥ అజ్ఞానం వల్ల నీకు 'శరీరమే నేను' అనే ధ్యాస కలిగింది. ఇలా దేహాత్మభావం కలగడంతో జగద్భ్రాంతి ఆవహించి నీ చేతనే ఈ కార్యక్రమా లన్నీ చెయ్యబడుతున్నాయనే అహంకారపరమైన సంసారభ్రమ కలిగింది. అంతేకాని నువ్వు శరీరానివి కావు. యదార్థంగా నువ్వు నిరాకార నిర్వికార, సుద్ధ,

శుద్ధ పరమాత్మస్వరూపుడవు. నీ ఆధ్యాత్మిక సాధన ఫలించి, నీకు ఆత్మానాత్మ వివేకం కలుగుతే, నీలో స్వస్వరూపమైన అపరోక్షజ్ఞానం అనే అగ్ని జనించి, అజ్ఞాన కార్యాలనన్నింటినీ వేళ్ళతో సహా దహించి వేస్తుంది.

ఎవడైతే తానెవరో, దేహాతీతంగా ఉంటూ, 'నేను నేన'ని తనలో సతతము స్ఫురిస్తూ ఉంటున్న తన నిజ స్వరూపం ఏదో, తానునిజమని నమ్ముతూన్న ప్రపంచం యొక్క యదార్థ స్వరూపమేదో, జనన మరణాల యదార్థం ఏమిటో గ్రహించుకుంటున్నాడో, వాడే అసలైన దైవభక్తుడు, యోగి, జ్ఞాని. వీటిని గురించి అవగాహన చేసుకునే ప్రయత్నంలో ఎల్లప్పుడూ వుంటూ, ఇతర లౌకిక కార్యక్రమాల్లో ఎంత మాత్రమూ తలదూర్చక, తత్వవిచార పరాయణుడై, ఎవడైతే సక్రమమైన సాధనానికి పూనుకున్నాడో, అప్పటి నుంచీ, అటువంటి సాధక మహాశయుడికి అన్నీ శుభదినాలే. ఇటువంటి సుభంకరమైన ప్రయత్నం చేపట్టక, ఇతర కార్యకలాపాలతో కాలాన్ని

నంద వైభవం శేషిస్తుంది. ఈ ఆత్మానంద వైభవమే పురుషార్థము, మహా ఐశ్వర్యము, సర్వోత్కృష్టము. ఈ పవిత్ర గ్రంథంలో వివరింపబడిన ఉత్తమ తత్త్వ విచారసాధన నిరంతరము అంతఃకరణలో అలవరచు కొని అనుష్ఠానము చేయు సాధకమహాశయుడు సర్వ దృశ్యాకార జగత్తును అనిత్యముగ (మిథ్యగ) గ్రహిం చుచు, కాలక్రమమున స్వయంస్ఫురణ వల్లనే ఆత్మ ప్రసన్నమై, అపరోక్షానుభూతి పొందగలుగును.

## ప్రార్థన

యస్మిన్సర్వం యతః సర్వం
యః సర్వం సర్వ తశ్చయః।
యశ్చ సర్వమయో నిత్యః
తస్మై సర్వాత్మనే నమః॥

తా॥ దేని యందు సమస్తము కలదో, దేని నుండి సమస్తము ఆవిర్భవిస్తున్నదో, ఏది సమస్తము అయియున్నదో, ఏది అంతటా వ్యాపించి యున్నదో

ఏది సర్వమయమై యొప్పుచున్నదో అట్టి సర్వ స్వరూప మగు ఆత్మకు సదా నమస్కారము. (సమస్త మనగా మిథ్యా స్వరూప జగత్తు)

ఇట్లు

ముముక్షువుల హితాభిలాషి

భాగవతి రామమోహనరావు

# మహా మంత్రం

దేహ మనిత్యం లోక మసత్యం
దేహో నాహం బ్రహ్మైవాహం।
బ్రహ్మం సత్యం బ్రహ్మం నిత్యం
ఏకం బ్రహ్మం సర్వం బ్రహ్మం॥

## మంత్రార్థ వివరణ

ఈ మహా మంత్రం సర్వ వేదాంత సిద్ధాంతసార సంగ్రహం. అన్నిమంత్రాలూ చిట్టచివరికి ఈ మంత్రం దగ్గరకే వచ్చి చేరుకుంటాయి.

స్థూల శరీరం స్వయంగా సత్తాస్ఫూర్తులు లేని, పాంచ భౌతిక పదార్థ సమ్మేళనము. అందుచేత అది అనిత్యమై, ఎప్పు డైనా నశించిపోయేది. సూక్ష్మ శరీరం జ్ఞానేంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారంతో కూడిన అంతఃకరణ. ఇది చంచల స్వభావం కలిగి, మార్పులు చెందుతూ, అనేక వికా రాలతో కూడిన అసద్రూపం. ఈ స్థూల, సూక్ష్మ శరీరాలని గురించి, ప్రపంచం యొక్క యదార్థాన్ని గురించి ఏమీ తెలియని

అజ్ఞానంలో ఉన్నానని. తనకి తెలియబడుతున్న స్థూల, సూక్ష్మ శరీరాలకు తాను ద్రష్టనని తన శరీరం తన నిజ స్వరూపం ఎంత మాత్రం కాదని గుర్తించుకుని, ఆరివర్తన పొందడం వివేకానికి ప్రథమ లక్షణం.

పంచేంద్రియాల ప్రవృత్తివల్ల గోచరించే భౌతిక ప్రపంచం మెళకువ అనబడే జాగ్రదావస్థకు పరిమితమైనది. అది అనిత్యమైన మాయా స్వరూపం (*Illusion*), శాశ్వతమైన ఉనికి సత్తా దానికి లేవు స్వప్నావస్థలోని దృశ్య విషయాలవలెనే, అది కూడా అసత్యమైన మిధ్యా స్వరూపం తప్ప యదార్థమైనది కాదని అవగాహన కలగడం వివేకానికి ద్వితీయ లక్షణం।

"ఇది నా శరీరం" అని దేహాన్ని తనకి అన్యమైన దానినిగా వ్యవహరించు కుంటూనే ఉంటాడు. కనుక, "నేను" అనేది ద్రష్ట, అంటే, తెలుసుకునే వాడని, దేహమనేది దృశ్యం, అంటే తెలుసుకోబడేదని స్పష్టంగా తనకు అనుభవ గ్రాహ్యమై సిద్ధించి వుండడం వివేకజ్ఞానానికి ప్రధాన లక్షణం.

తాను స్థూల, సూక్ష్మ శరీరాలకి. విలక్షణుడనని, భిన్నుడనని గాఢమైన విశ్వాసం ఎప్పుడైతే కలుగుతుందో, అప్పుడు తన యదార్థ స్వరూపమైన ఆత్మతత్వం అవగాహన అయి, అవా

జ్ఞానస గోచరము, చైతన్యస్వరూపము అయిన సద్వస్తువు (బ్రహ్మ జ్ఞానం) ఉదయిస్తుంది. బ్రహ్మస్వరూపుడైన తానుతప్ప తన కన్యమైనవన్నీ, తన శరీరంతోసహా, అనిత్యమైన మిథ్యా స్వరూపములని నిత్యా నిత్యవస్తు వివేకం స్పష్టంగా అనుభూతి అయి, అహంకార పరమైన జీవన భ్రాంతి తొలంగిపోతుంది. తనను దేహాతీత, నాశరహిత, నిత్య, సత్యాత్మ స్వరూపునిగా గుర్తించుకుని దివ్యానుభవాన్ని పొందగలుగుతాడు.

తన నిజస్వరూపమైన ఆ పరబ్రహ్మం యదార్థంగా శాశ్వతంగా, ఎప్పుడూ, అంతటా ఉంటూన్న చైతన్యానంద స్వరూపము. అది తప్ప వేరేదీలేదు. తాననేది లేని శాశ్వతము, సర్వవ్యాపకము నాశరహితము, అగోచరము, అనంత, అద్వయానంద స్వరూపము అయిన ఆ పరబ్రహ్మం ఒక్కటే పరిపూర్ణ పరమ శాంత స్వరూపమై విరాజిల్లుతున్నది.

## మహా యజ్ఞం

మాయా స్వరూపమైన ప్రపంచంలో, అహంకార మమకారాంతో, ఏ కర్మలు చేసినా, అర్థరహితములే. అవి ఆధ్యాత్మిక ప్రయోజనము, ప్రగతి కలుగజేసేవి ఎలా అవుతాయి?

దేహాత్మబుద్ధితో బాహ్యంగా ఆచరించే యజ్ఞయాగాలు, వ్రతాలు, పూజలు, తపస్సులు, ప్రార్థనలు భజనలు తీర్థయాత్రలు మొదలైనవి కొంత మనశ్శాంతి, చిత్తశుద్ధి, క్రమశిక్షణ కలిగించుటకు తోడ్పడగలవే కాని, ఆత్మజ్ఞాన సిద్ధి కలించవు. ఇలాంటివన్నీ బహిర్యాగములు. యజ్ఞకర్మలు, పుణ్యకార్యములు మొదలైన బహిర్యాగములన్నీ నిజానికి దుర్బలాలైన ఓటు పడవల వంటివని, అవే సర్వోత్కృష్టమైనవి కాపిస్తూ, వాటిమీదే ఆసక్తి కలిగి, వాటికి మించినదేది లేదనుకునేవారికి జ్ఞానోదయం కలుగదని, ఆ కర్మల ఫలములైన స్వర్గలోక సుఖాల అనంతరం మళ్ళీ వారికి అధోగతేననీ ఉపనిషత్తులలో స్పష్టం చెయ్యబడింది. వ్యాసభగవానుడు ప్రసాదించిన 'గురు గీత' లో కూడా ఇదే విధంగానే విశదం చేశాడు. భగవంతుడనబడే ఆత్మస్వరూపము మంచీ, చెడూ, వంటి అన్ని ద్వంద్వాలకీ అతీతము అభౌతికము. అహం జ్ఞానస్త్రగోచరము.మాయా స్వరూపమైన ప్రపంచంలో, మంచి పనులనుకునేవికూడా ఆధ్యాత్మికంగా అనర్థదాయకములే అవుతాయి. అన్ని కార్యములకీ, మంచివికాని, చెడ్డవికాని అహంకార పరమైన సంకల్పాలు బీజాలౌతాయి. అన్ని సంకల్పాలకి మూలం ఆశ, ఆకాంక్ష. సంకల్ప సూన్యస్థితి పొంది, ఆత్మానుభూతి సిద్ధించడానికి, ఇవన్నీ అవరోధాలే అవుతాయి కదా! ఇటువంటి బహిర్యాగాలు ఎన్నెన్ని

ఎంతకాలం ఆచరించినా జ్ఞానోదయం కలుగదు. ఈ శుష్క బాహ్యాచరణాలన్నిందినీ అలక్ష్యంచేస్తూ, అంతరంగిక దృక్పథం అలవరచుకొని, హృదయస్థలిలో సంప్రాప్తమయే ఆత్మానుభవం వైపునకు దృష్టి మళ్ళించి, అభ్యసించే ఆత్మవిచార సాధన యదార్థమైన ఆధ్యాత్మిక సాధన అవుతుంది. ఈ అంతర్యాగం వల్లనే ఫలప్రదమైన ఆధ్యాత్మిక సంపన్నత కలుగుతుంది. దీనిని స్వస్వరూపాను సంధానమని, నిధిధ్యాస అని, తత్వ విచారమని కూడా శాస్త్రాల్లో పేర్కొంటారు. శుష్కమైన అన్ని బాహ్యాచరణలూ చివరకు సాధకుణ్ణి ఈ అంతరంగిక అనుష్టానం దగ్గరకు తీసుకువస్తాయి.

తత్వమస్యాది మహా వాక్యాలు 'నీవే బ్రహ్మస్వరూపుడవై ఉన్నావు' అని ఆత్మానుభూతికి సరాసరి దారి చూపే మహత్తర తత్వాన్ని, సాధకుణ్ణి తట్టి బోధచేస్తున్నాయి. ఈ పరతత్వాను భూతిని అంతర్యాగం వల్ల పొందడమే ప్రజ్ఞానం. ఈ జ్ఞానోదయం వల్ల దేనివలనా సాధ్యం కాని, అజ్ఞానాంధకారమంతా పటాపంచలై అంతమౌతుంది. గోచరించే జడస్వరూపాలైన, ప్రపంచం, శరీరాలు, పంచేంద్రియాలు, అంతఃకరణచతుష్టయ మనబడే మనఃస్చిత్త, బుద్ధ్యహంకారాలు, అన్నీ మిథ్యాస్వరూపాలు, అసత్యాలు తప్ప యథార్థాలు కావని, సర్వావస్థల

వెనుకా, వాటికి మూలమైవున్న పరతత్వం ఏకైక చైతన్యానంద స్వరూపమైన బ్రహ్మమేనని, అది తానే అయివున్నాడని దివ్యానుభవం సంప్రాప్తిస్తుంది. దేహాత్మభావం, పరిమితత్వం, వ్యక్తిత్వం మొదలైన కళంకములతో కూడిన జీవభ్రాంతి తొలగిపోయి విముక్తుడౌతాడు. సర్వాతీత, ఆత్మానంద స్వరూపుడైన తాను తప్ప ఇతరమంతా స్వప్నసమానమైన మిథ్యా స్వరూపమేకాని, యదార్థంకాదని అనుభవ గ్రాహ్యం కలిగి అందులో స్థిరత్వం సిద్ధిస్తుంది. ఇదే అపరోక్షజ్ఞానం, లేక సమ్యక్జ్ఞానం. అంతరంగికంగా, స్వస్వరూపానుసంధానమనే ఆత్మధ్యానం నిరంతరంగా దృఢాభ్యాసం చేసుకుంటే, ఈఅపరోక్షజ్ఞానం సంప్రాప్తిస్తుంది. ఈ అంతర్యాగమే మోక్షోపాయకరమైన మహాయజ్ఞం.

## మహా పుణ్యం

సామాన్యంగా మానవులచే భావింపబడే పుణ్య, పాపాలు మాయాస్వరూపమైన లౌకిక జీవితానికి సంబంధించినవి. ఆధ్యాత్మిక దృష్టిలో పాపం అంటే ఆత్మవిస్మృతి. పుణ్యం ఆత్మస్మృతి. ఆత్మ విస్మృతిలో ఉన్నంత కాలమూ దేహ, ప్రపంచాదుల భ్రాంతి తప్పదు. ఎప్పుడైతే ఆత్మస్మృతి (ఆత్మానుభూతి) సిద్ధిస్తుందో, అప్పుడే 'మాయా స్వరూపాలైన దేహాలోకాల భ్రమ తొలగిపోతుంది.

నామ రూపాలతో పరిమితమైన ఆకృతిగల అనిత్యమైన శరీరమే తాననుకునే దేహాత్మభావమే అజ్ఞానమయమైన మహాపాపం. ఇంద్రియాలకి, మనస్సుకి గోచరించే దృశ్యప్రపంచం యొక్క నామరూపాలన్నింటినీ, స్వశరీరంతోసహా మిథ్యగా విస్మరిస్తూ, సంకల్ప వికల్పాల్నీ, విషయ ప్రవృత్తినీ వొదుల్చుకుంటూ, నిర్వికారంగా తన యాదార్థ స్వరూపమైన బ్రహ్మానుభవం కోసం సక్రమమైన సాధనానుష్ఠానం చేపట్టడమే యదార్థమైన పుణ్యకార్యం. సర్వోత్కృష్టమైన ఈ సాధనని స్వస్వరూపాను సందానమని, నిధిధ్యాస అని, ఆత్మ విచారమని వేదాంత శాస్త్రాలు పేర్కొన్నాయి. మహోన్నతమైన ఈ సాధన యొక్క అంశాలు ఈ పవిత్ర గ్రంథలో ఎంతో విపులంగా వివరింపబడ్డాయి. మోక్షోపాయకరమైన ఈ సాధనాభ్యాసమే మహా పుణ్యం. ఈ మహా పుణ్యకార్యాన్ని ఆచరిస్తే అతి దుర్లభమైన మనుష్యజన్మ సార్థకమౌతుంది.

## ప్రార్థన

ఏ వివేక ప్రసాదముచే జ్ఞానోదయమై పూర్వపు అజ్ఞానమయమైన జీవభ్రాంతి తొలగి ఆత్మ స్వరూపానుభూతి సిద్ధించెనో, అట్టి వివేకమునకు నమస్కారము.

సర్వాతీతము, సర్వస్వరూపము, స్వస్వరూపము అయిన పరమాత్మకు నమస్కారము. ఈ సత్యస్వరూప జ్ఞానము ప్రబోధించు వేదాంత శాస్త్రములకు, సద్గురువులకు నమస్కారము.

శ్రీమత్పరబ్రహ్మ జగద్గురుం స్మరామి
శ్రీమత్పరబ్రహ్మ జగద్గురుం భజామి ।
శ్రీమత్పరబ్రహ్మ జగద్గురుం వదామి
శ్రీమత్పరబ్రహ్మ జగద్గురుం నమామి ॥

భాగవతి రామమోహనరావు



శృతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయం
నమామి భగవత్పాద శంకరం లోక శంకరమ్।

ఓం

శ్రీ శంకర భగవత్పాద విరచిత

# అపరోక్షానుభూతి

## బ్రహ్మవిద్యా విధానము

(1)

శ్రీహరిం పరమానంద ముపదేష్టార మీశ్వరమ్ ।
వ్యాపకం సర్వలోకానాం కారణం నమామ్యహమ్ ॥

పరమానంద స్వరూపుడు, గురువులలో ప్రప్రథముడు, ఈశ్వరుడు, సర్వవ్యాపకుడు, ఏకైకస్వరూపుడు, సమస్తలోకకారకుడు అయిన శ్రీహరి పాద పద్మములకు ప్రణామము లర్పిస్తున్నాను.

(2)

అపరోక్షానుభూతిర్వై ప్రోచ్యతే మోక్షసిద్ధయే ।
సద్భిరేవ ప్రయత్నేన వీక్షణీయా ముహుర్ముహుః ॥

అజ్ఞానబంధం నుంచి నివృత్తి కలిగి, జీవిత పరమార్థమైన మోక్షం సిద్ధించడానికి దారిచూపే ఉద్దే

శంతో ఈ అపరోక్షానుభూతి ప్రసాదింపబడింది. చిత్త శుద్ధి, పవిత్ర హృదయంకల సాధకులు దీనిలో ప్రబోధించిన పరమ సత్యాన్ని ప్రతినిత్యమూ పదే పదే శ్రద్ధాభక్తులతో ధ్యానం చేసుకోవాలి.

(3)

స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్ ।
సాధనం ప్రభవేత్ పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్ ॥

ఆత్మజ్ఞాన ప్రాప్తికి, సాధన చతుష్టయం అనబడే వైరాగ్యం, నిత్యానిత్యవస్తువివేకం, శమదమాదులు, ముముక్షత్వం ప్రథమ యోగ్యతలు. ఈ యోగ్యతలు ఇంద్రియసుఖాల్ని పరిత్యజించి, తమకు జీవితంలో నిర్దేసింపబడిన కర్తవ్యకార్యాల్ని చిత్త శుద్ధితో చేస్తూ, దైవానుగ్రహంకోసం శ్రీహరిని ఆరాధించే మానవోత్తములకు సంప్రాప్తిస్తాయి.

(4)

బ్రహ్మాది స్థావరాన్తేషు వైరాగ్యం విషయే ష్వను ॥
యథైవ కాకవిష్టాయాం వైరాగ్యం తద్ధి నిర్మలం ॥

కాకిరెట్టని ఎంత అసహ్యంగా ఏవగింపుతో చూస్తారో, అలా బ్రహ్మాది పర్యంతమూ ఈ ప్రపంచంలో వుండే సమస్త విషయ సుఖభోగాలకి సంబంధించిన పదార్థాల్ని చూడడం అసలైన, నిర్మలమైన వైరాగ్యం.

(5)

నిత్యమాత్మ స్వరూపం హి దృశ్యం తద్విపరీతగమ్ ।
ఏవం యో నిశ్చయః సమ్యగ్వివేకో వస్తునః సవై ॥

సర్వసాక్షీ, సర్వాధిష్ఠానము అయిన పరమాత్మ స్వరూపం ఒక్కటే నిత్యమై ఎల్లప్పుడూ ఉండేదని, దానికి వ్యతిరిక్తమై విపరీతంగా ఉన్న దృశ్యజాతమంతా వట్టి అసత్యము, అనిత్యము, మిథ్యా స్వరూపము, స్వప్నతుల్యము అని తత్వవిచారణచే నిర్ధారణ చేసుకుని, నిశ్చయించుకోడం 'నిత్యానిత్యవస్తు వివేకం' లేక 'సమ్యగ్వివేకం' అని చెప్పబడుతోంది.

(6)

సదైవ వాసనాత్యాగః శమోయ మితి శబ్దితః ।
నిగ్రహో బాహ్యావృత్తీనాం దమ ఇత్యభిధీయతే ।

సర్వకాల సర్వావస్థలలోనూ, విషయాలలోని దోషాల్ని పరిశీలిస్తూ, వాటికి సంబంధించిన వాసన లన్నింటినీ విరక్తితో వొదుల్చుకోవడం 'శమ' మని పిలువబడుతోంది. ఇక కర్మేంద్రియాల్ని వాటి వాటి వ్యాపారాల లోకి పోనివ్వక, అరికడుతూ, వాటిని పరమాత్మ ధ్యాసలో నిలపడం 'దమ'మని చెప్పబడు తోంది.

(7)

విషయేభ్యః పరావృత్తిః పరమోపరతిర్హి సా ।
సహనం సర్వదుఃఖానాం తితిక్షా సా శుభామతా ॥

చంచల స్వభావమైన మనస్సును విషయ చింతలలోంచి మళ్ళించి, తత్వవిచార సాధనలో నిల పడం 'ఉపరతి' అనబడుతోంది. సర్వదుఃఖాలనూ, బాధావమానాల వంటి అరిష్టాలనూ సహించి, ఎవరికీ మనోవాక్కాయకర్మలా ఎటువంటి ప్రతీకారమూ చెయ్యకుండా వుండడం 'తితిక్ష' అనబడుతోంది.

(8)

నిగమాచార్య వాక్యేషు భక్తితః శ్రద్ధేతి విశ్రుతా ।
చిత్తైకాగ్రంతు సల్లక్ష్యే సమాధానమితి స్మృతమ్ ॥

వేదాంత గ్రంథాలలోని అధ్యాత్మికసిద్ధాంతాల పట్లా, వాటిని విస్తృతంగా ప్రబోధించే సద్గురువుల మాటల మీదా అత్యంత శ్రద్ధా, భక్తీ కలిగి ఉండడం "శ్రద్ధ" అనబడుతోంది. మనస్సును అన్యమొల్లని చిత్త ఏకాగ్రతతో సద్వస్తువైన పరమాత్మ స్వరూప చింతనలో నిమగ్నంచేసి ఉండడం 'సమాధానమని' భావించబడుతోంది.

(9)

సంసారబంధ నిర్ముక్తిః కథంమే స్యాత్ కదా విధే ।
ఇతి యా సుదృఢా బుద్ధిర్వక్తవ్యాసా ముముక్షుతా ॥

'ఓ భగవంతుడా! జనన, జరా, మరణాదులతో కూడిన ఈ సంసార బంధమనే అజ్ఞానపు భ్రాంతి నుంచి నాకెప్పుడు ఏ విధంగా విముక్తి కలుగుతుంది?' అని ఎల్లప్పుడూ తీవ్రతరమైన ఆందోళనతో సాధనేచ్ఛ కలిగి వుండడం 'ముముక్షత్వ' మనబడుతుంది.

(10)

ఉక్త సాధన యుక్తేన విచారః పురుషేణ హి ।
కర్తవ్యోజ్ఞాన సిద్ధ్యర్థ మాత్మనః శుభమిచ్ఛతా ॥

ఇలా చెప్పబడిన ఆధ్యాత్మికసాధనకు యోగ్యతలను సంపాదించుకుని, ఆత్మజ్ఞానప్రాప్తి కోసం అర్హుడైనవాడు నిత్యమూ, నిరంతరాయంగా తన ఆధ్యాత్మిక కర్తవ్యాన్నీ, శ్రేయస్సునీ గురించి తలపోస్తూ, లక్ష్యసిద్ధియైన పరమాత్మ స్వరూప చింతనలోనే నిమగ్నుడై ఉండాలి.

(11)

నోత్పద్యతే వినా జ్ఞానం విచారేణాన్య సాధనైః ।
యదా పదార్థభానం హి ప్రకాశేన వినా క్వచిత్ ॥

చీకటిలో వున్న వస్తువు దీపసహాయంతోనే గోచరిస్తుంది తప్ప ఏ ఇతర సాధనములవల్లా అది కనిపించలేదు. అలాగే ఆత్మజ్ఞానం, తత్వవిచార సాధన (నిధిధ్యాస) వల్లనే జనిస్తుంది తప్ప ఏ ఇతర కార్యకలాపాల వల్లా అది సిద్ధించదు.

(12)

కోఽహం కథమిదం జాతం కో వైకర్తాస్య విద్యతే ।
ఉపాదానం కిమస్తీహ విచారః సోఽయమీదృశః ॥

'నేనెవడను? ప్రతినిత్యమూ నా అనుభవం లోకి వస్తున్న ఈ జాగ్రత్, స్వప్న, సుషుప్తులనబడే అవస్థలు ఎలా సృష్టింపబడి, సంభవిస్తున్నాయి? వాటికి కారకుడూ, సృష్టికర్తా ఎవరు? జాగ్రత్, స్వప్నావస్థ లలోని దృశ్య, స్వప్న ప్రపంచ జాతమంతా ఏపదార్థ నిర్మితమై అలా గోచరిస్తోంది?' ఈ విధంగా విచారణ కొనసాగించాలి.

(13)

నాహం భూతగణో దేహో నాహం చాక్షగణ స్తథా ।
ఏతద్విలక్షణః కశ్చిద్విచారః సోఽయ మదృశః ॥

''పంచభూత సమ్మేళనమై, వట్టి జడ పదార్థ దాయకమైన ఈ స్థూలదేహం నేను కాదు.

శబ్ద, స్పర్శ, రూప, రసగంధాలనే పంచేంద్రియ కూటమి అయిన సూక్ష్మశరీరం కూడా నేను కాదు.

నేను వీటన్నిటికీ భిన్నుడను, విలక్షణుడను అయి వున్నాను." ఈ విధంగా స్వస్వరూప నిర్ణయ విచారణ కొనసాగించుకోవాలి.

(14)

అజ్ఞాన ప్రభవం సర్వం జ్ఞానేన ప్రవిలీయతే ।
సంకల్పో వివిధః కర్తా విచారః సోఽయమీదృశః ॥

శరీర ప్రపంచాదులతో గోచరించే ఈ దృశ్య జాతమంతా అజ్ఞానంతో కూడిన భ్రాంతివల్లనే అలా భాసిస్తోంది. జ్ఞానోదయమైన వెంటనే అదంతా వట్టి అసత్యమైన మిథ్యా స్వరూపమని విదితమౌతుంది. అంతఃకరణలో జనించే నానా విధ సంకల్ప వికల్పాలూ వీటన్నిటినీ సృష్టిస్తూ, వీటికి కారణమౌతున్నాయని తెలివి కలుగుతుంది.

(15)

ఏతయోర్య దుపాదాన మేకం సూక్ష్మం సదవ్యయమ్ ।
యథైవ మృద్ ఘటాదీనాం విచారః సోఽయ మీదృశమ్ ॥

మట్టితో తయారయే కుండ మొదలైన వస్తువులన్నీ యదార్థంగా మట్టే అయినట్లు ఈ రెండూ, అంటే, అజ్ఞానము, దానివల్ల జనించే సంకల్ప వికల్పాలూ, సూక్ష్మము ఏకైక స్వరూపము అయి ఎల్లప్పుడూ అంతటా వుండే సచ్చిదానంద పరబ్రహ్మమే.

(16)

అహమేకోఽపి సూక్ష్మశ్చ జ్ఞాతా సాక్షీ సదవ్యయః।
తదహం నాత్ర సందేహో విచారః సోఽయమోదృశః॥

'అందుచేత ఏకైక స్వరూపము, సూక్ష్మము, సర్వజ్ఞాత, సర్వసాక్షి, ఎల్లప్పుడూ అంతటా ఉంటూండే అవ్యయము అయిన ఆ సచ్చిదానంద పరబ్రహ్మన్ని నేనే అయివున్నాను. ఇందులో ఎంత మాత్రమూ, ఎటువంటి సందేహమూ లేదు.' ఈ విధమైన విచారణ ద్వారా స్వస్వరూప నిర్ధారణ చేసుకోవాలి.

(17)

ఆత్మా వినిష్కలో హ్యేకో దేహో బహుభిరావృతః
తయోరైక్యం ప్రపశ్యంతి కిమజ్ఞాన మతః పరమ్ ॥

ఆత్మ ఎటువంటి విభాగాలూ లేని కేవల ఏకైక స్వరూపం. దేహమో, అనేక పదార్థాలు, అవయవాలు అనే విభాగాలు కలిగి వుంది. అయినప్పటికీ, మానవులు దేహాన్నీ, ఆత్మనీ ఒకటిగానే భావిస్తూ మనుగడ సాగిస్తున్నారు. ఇంతకంటే వేరే అజ్ఞానం ఏముంటుంది?

(18)

ఆత్మా నియామకశ్చాంతర్ దేహో బాహ్యో నియమ్యకః।
తయోరైక్యం ప్రపశ్యంతి కిమజ్ఞాన మతః పరమ్ ॥

ఆత్మ అంతర్యంలో నిరాకారంగా అధిష్ఠానమై వుంటూ పరిపాలించే ప్రభువు. దేహం బాహ్యంగా, ఆకారం కలిగి వుంటూ పాలింపబడేది. అయినా, మానవులు ఈ రెండింటినీ ఒకటిగానే భావిస్తూ ఉంటున్నారు. ఇంతకంటే అజ్ఞానం వేరే ఏముంటుంది?

(19)

ఆత్మా జ్ఞానమయో పుణ్యో దేహో మాంసమయో సుచిః।
తయోరైక్యం ప్రపశ్యంతి కిమజ్ఞానమతః పరమ్ ॥

ఆత్మ జ్ఞానమయమైన ఎరుక. అతిపవిత్రమైనది. దేహమంతా రక్తమాంసాది అశుద్ధ పదార్థాలతో కూడి అపవిత్రమైనది. అయినా ఈ రెండింటినీ ఒకటిగానే భావిస్తున్నారు. ఇంతకంటే అజ్ఞానం మరేముంటుంది?

(20)

ఆత్మా ప్రకాశకః స్వచ్ఛో దేహస్తామస ఉచ్యతే ।
తయోరైక్యం ప్రపశ్యంతి కి మజ్ఞాన మతః పరమ్ ॥

ఆత్మ స్వయంప్రకాశము, అత్యంతపరిశుద్ధము, నిర్మలము అయివుంది. దేహము స్వయంగా సత్తా స్ఫూర్తులు లేని అంధకారమయమై వుంది. కనుక తామసమని చెప్పబడుతోంది. అయినా జనులు దేహాన్నీ ఆత్మనీ ఏకంగా భావిస్తూ, తాము దేహాలమని అనుకుంటున్నారు. ఇంతకంటే అజ్ఞానం ఏముంటుంది?

(21)

ఆత్మా నిత్యోహి సద్రూపో దేహో నిత్యో హ్యసన్మయః
తయోరైక్యం ప్రపశ్యంతి కి మజ్ఞాన మతః పరం ॥

ఆత్మ నిత్యమై కేవలము సత్య స్వరూపమై వుంది. దేహమో, అనిత్యమైన వట్టి మిథ్యాస్వరూపము. అయినా! ఈ రెండింటినీ, ఏకంగా భావిస్తున్నారు. ఇంతకంటే వేరే అజ్ఞానం ఏముంటుంది?

(22)

ఆత్మనస్తత్ ప్రకాశత్వం యత్పదార్థావభాసనమ్ ।
నాగ్న్యాది దీప్తి వద్దీప్తిర్భవత్యాంధ్యం యతో నిశి ॥

సమస్త దృశ్య జాతాలూ దేని ప్రకాశం వల్ల తెలియబడుతున్నాయో, అటువంటి ఆత్మప్రకాశం అగ్ని మొదలైన వాటి దీప్తి ప్రకాశం వంటిది కాదు. అగ్ని, సూర్యుడు మున్నగువాటి ప్రకాశాలు పరిమితమైనవవడంచేత, అవి వున్నా, చీకటి కొన్నిచోట్ల వుండనే వుంటుంది.

(23)

దేహోహ మిత్యయం మూఢో ధృత్వా తిష్ఠంత్యహో జనః ।
మమాయ మిత్యపి జ్ఞాత్వా ఘటద్రష్టేవ సర్వదా ॥

ఒక కుండను చూసేవాడు ఆ కుండ తనకంటే భిన్నమైందని తెలుసుకునేటట్లు, ఈ దేహం తనకు చెందిన, అన్యమైన ఒక వస్తువని తెలుసుకుని కూడా మూఢమానవుడు ఈ దేహమే తాననుకుని అజ్ఞానంతో ఉంటున్నాడు. ఇది ఎంత ఆశ్చర్యం?

(24)

బ్రహ్మైవాహం సమః శాంతః సచ్చిదానంద లక్షణః
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞాన మిత్యుచ్చతే బుధైః॥

'నేను కేవలము బ్రహ్మస్వరూపుణ్ణి, సమమైనవాడను. శాంత స్వభావుడను. సచ్చిదానందమే నా లక్షణం. నే నీదేహాన్ని కాను. ఎందువలననంటే ఆది అసద్రూపమైనది' ఇలా గ్రహించుకోవడమే యదార్థమైన జ్ఞానమని పండితులు తెలుపుతున్నారు.

(25)

నిర్వికారో నిరాకారో నిరవద్యో౽హ మవ్యయః ।
నాహందేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

'నేను ఏ మార్పూ చెందని నిర్వికార స్వరూపుడను. నిరాకారుడను. నిర్మలుడను. నాశరహితుడను. అసద్రూపమైన ఈ దేహం నేను కాదు' వివేకంతో కూడిన ఇలాంటి తెలివి ఉదయించడమే జ్ఞానమని ఆత్మనిష్ఠులైన పండితులు తెలుపుతున్నారు.

(26)

నిరామయో నిరాభాసో నిర్వికల్పోఽహ మాతతః।
నాహందేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

'నేను రోగాలేవీ సంక్రమించని వాడను. దృశ్యాతీతుడను. సంకల్ప వికల్పాలు లేనివాడను. సర్వవ్యాపకుడను. అసద్రూపమైన ఈ దేహాన్ని నేను కాను.' ఇటువంటి అనుభవగ్రాహ్యమే జ్ఞానమని పండితులచే చెప్పబడింది.

(27)

నిర్గుణో నిష్క్రియో నిత్యో నిత్యముక్తోఽహమచ్యుతః।
నాహందేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

'నేను గుణరహితుడను, క్రియా శూన్యుడను, నిత్యమైన వాడను. (ఎల్లప్పుడూ ఉండే వాడను.) నిత్యముక్తుడను. నాశములేని సచ్చిదానంద స్వరూపుడను. అసద్రూపమైన ఈ దేహాన్ని నేను కాను.' ఈ విధమైన అవగాహన జ్ఞానమని పండితులు చెబుతున్నారు.

(28)

నిర్మలో నిశ్చలోఽనంతః శుద్ధోహ మజరోఽమరః।
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

'నేను అజ్ఞానం వల్ల కలిగిన మాలిన్యం ఎంత మాత్రమూ లేనివాడను; నిశ్చలమైన వాడను; అనంతుడను. పరిశుద్ధమైన వాడను; వ్యాధులు, వృద్ధత్వము లేనివాడను; మృత్యువు లేని అమరుడను. అసద్రూపమైన ఈ శరీరాన్ని నేను కాను.' ఈ విధమైన తత్వ నిర్ణయమే జ్ఞానమని పండితులచే చెప్పబడుతోంది.

(29)

స్వదేహే శోభనం సంతం పురుషాఖ్యం చ సమ్మతం।
కిం మూర్ఖశూన్యమాత్మానం దేహాతీతం కరోషి భోః॥

ఓయీ! మూర్ఖుడా! నీ దేహంలోనే ఆనంద స్వరూపుడై పురుషుడనే పేరుతో స్మృతులలో పర బ్రహ్మస్వరూపుడని సమ్మతింపబడి దేహాతీతుడై వుంటున్న ఆత్మను అసలే లేని వానినిగా విస్మరించి ఎలా ఉండ గలుగుతున్నావు?

(30)

స్వాత్మానం శృణు మూర్ఖత్వం శ్రుత్యా యుక్త్యాచ పూరుషమ్
దేహాతీతం సదాకారం సుదుర్దర్శ్య భవాదృశైః ॥

అజ్ఞానివైన ఓ మూర్ఖుడా! శ్రుతులలో చెప్ప బడిన సిద్ధాంతాలచేతా, విచారణా యుక్తులవల్లా, ఈ దేహానికి విలక్షణుడై, సత్యస్వరూపుడైవుంటున్న పురు షుడనబడే నీ ఆత్మస్వరూపాన్ని తెలుసుకోడానికి (ఆత్మానుభూతి పొందడానికి) ప్రయత్నించు. నీబోటి అజ్ఞానులకి దాన్ని అవగాహన చేసుకోవడం బహు కష్టసాధ్యమే.

(31)

అహం శబ్దేన విఖ్యాత ఏక ఏవ స్థితః పరః ।
స్థూల స్త్వనేకతాం ప్రాప్తః కథం స్యాద్దేహకః పుమాన్॥

"నేను" అని భాసించే అహం శబ్దవాచ్యుడైన పరమాత్మ, ఒక్కడే, ఏకైక స్వరూపుడై వుంటు న్నాడు, అయితే ఈ స్థూలమైన శరీరాలు, పదార్థాలు అనేకం వుంటున్నట్లు గోచరిస్తున్నాయి. అలాటప్పుడు ఈ దేహం పురుషుడు ఎలా అవుతుంది?

(32)

అహం ద్రష్టతయా సిద్ధో దేహో దృశ్యతయా స్థితః।
మమాయమితి నిర్దేశాత్ కథం స్యాద్దేహకః పుమాన్॥

'నేను' అనేది ద్రష్ట, అంటే, తెలుసుకునే వాడని. ఈ దేహమనేది దృశ్యం, అంటే, తెలుసుకో బడేదని స్పష్టంగా తెలిసిపోతూ సిద్ధించి వుంది.

'ఇది నా శరీరం'. అని అంటూ మన దేహాన్ని మనకు భిన్నమైన దాన్నిగా వ్యవహరించుకుంటూనే వున్నాము. అలాటప్పుడు ,ఈ దేహం ఆత్మస్వరూప మైన పురుషుడు ఎలా అవుతుంది?

(33)

అహం వికార హీనస్తు దేహో నిత్యం వికారవాన్।
ఇతి ప్రతీయతే సాక్షాత్ కథంస్యాద్దేహకః పుమాన్॥

"నేను" అని అందరిలో భాసించే ఆత్మ (పురుషుడు) ఎటువంటి మార్పులూ లేక నిర్వికారిగా వుంటుందని, దేహం వికారాలతో ఎల్లప్పుడూ మార్పులు చెందుతూ ఉంటుందని ప్రత్యక్షానుభవంగా యదార్థమైన విషయం. అలాటప్పుడు, ఈ దేహం నిర్వికారుడైన పురుషుడు ఎలా అవుతుంది?

(34)

యస్మాత్ పరమితి శ్రుత్యా తయా పురుషలక్షణమ్।
వినిర్ణీతం విమూఢేన కథం స్యాద్దేహకః పుమాన్॥

అంతా తానే అయి పరిపూర్ణుడై వుంటున్న పురుషుడి లక్షణాలు శ్రుతులలో (ఉపనిషత్తులలో) స్పష్టంగా నిశ్చయించి చెప్పబడ్డాయి. అటువంటప్పుడు, ఓయీ మహా మూఢుడా! ఈ శరీరం పురుషుడు (ఆత్మ) ఎలా అవగలదు?

(35)

సర్వం పురుష ఏవేతి సూక్తే పురుష సంజ్ఞితే ।
అప్యుచ్యతే యతః శ్రుత్యా కథం స్యాద్దేహకః పుమాన్ ॥

శ్రుతుల లోని పురుషసూక్తంలో కూడా ఈ సమస్తమూ పురుష స్వరూపమే అని చెప్పబడింది. అందుచేత ఈ దేహం పురుష డెలా అవుతుంది?

(36)

అసంగః పురుషః ప్రోక్తో బృహదారణ్యకేఽపి చ ।
అనంత మలసంశ్లిష్టః కథం స్యాద్దేహకః పుమాన్ ॥

బృహదారణ్యకోపనిషత్తులో కూడా పురుషుడు సంగరహితుడని, దేనినీ అంటనివాడని చెప్పబడింది. అటువంటప్పుడు ఎన్నో మలిన పదార్థాలతో కూడి వున్న ఈ శరీరం పురుషుడెలా అవుతుంది?

(37)

తత్రైవచ సమాఖ్యాతః స్వయంజ్యోతిర్హి పూరుషః ।
జడః పరప్రకాశోఽయం కథం స్యాద్దేహకః పుమాన్ ॥

పురుషుడు స్వయంప్రకాశ స్వరూపుడనికూడా బృహదారణ్యకోపనిషత్తులో చెప్పబడింది. ఈ దేహం స్వయం సత్తా స్ఫూర్తులు లేని జడ పదార్థ నిర్మితమై, ఇతర ప్రకాశంవల్ల తెలియబడుతోంది. అటువంటి దేహం పురుషుడెలా అవుతుంది?

(38)

ప్రోక్తోపి కర్మకాండేన హ్యాత్మా దేహాద్విలక్షణమ్ ।
నిత్యశ్చ తత్ఫలం భుజ్క్తే దేహ పాతాదనంతరం ॥

కర్మకాండకు చెందిన సిద్ధాంతరీత్యా కూడా ఆత్మ ఈ దేహంకంటె విలక్షణుడని, నిత్యుడని, దేహం నశించిన తరువాత కూడా ఆత్మ ఉంటూ, కర్మఫలాలను అనుభవిస్తుందని చెప్పబడింది.

(39)

లింగం చానేక సంయుక్తం చలం దృశ్యం వికారి చ ।
అవ్యాపక మసద్రూపం తత్ కథం స్యాత్ పుమాన్ ॥

సూక్ష్మ శరీరమనబడే లింగ శరీరం కూడా అనేక భాగాలతో కూడినది. చంచల స్వభావం కలది.

తెలుసుకోబడే దృశ్యము. మార్పులు చెందుతూ అనేక వికారాలతో పరిమితమైవుంది. కాబట్టి అసద్రూపము. అందుచేత అది పురుషుడు (ఆత్మ) ఎలా అవుతుంది?

(40)

ఏవం దేహద్వయాదన్య ఆత్మా పురుష ఈశ్వరః ।
సర్వాత్మా సర్వరూపశ్చ సర్వాతీతోఽహమవ్యయః ॥

ఈ విధంగా ఆత్మ స్థూల, సూక్ష్మ శరీరాల రెండింటికీ అన్యమైన వాడు. సర్వాధిష్ఠానమైన పురుషుడు. ఈశ్వరుడు. అందరిలో అన్నింటిలో, అంతటా వుండే సర్వాత్మ స్వరూపుడు. అన్ని రూపాలూ, ఆకారాలూ ఆయనవే. అయినా వాట న్నింటికీ అతీతుడై, అవ్యయుడై వుంటాడు.

(41)

ఇత్యాత్మ దేహభాగేన ప్రపంచస్యైవ సత్యతా ।
యథోక్తా తర్కశాస్త్రేణ తతః కిం పురుషార్థతా ॥

ఇలా దేహమూ, ఆత్మా భిన్నమైనవని, ఒకటి కాదని నిరూపించు కోవడం వల్ల, తర్కశాస్త్ర రీత్యా, దేహాదులతో కూడిన ఈ దృశ్య ప్రపంచమంతా కూడా యదార్థమైనది, నిత్యమైనదని చెబుతే, దాని వల్ల పరమ పురుషార్థమైన పరమాత్మ తత్వాన్ని పొందే ప్రయోజనం ఏముంటుంది?

(42)

ఇత్యాత్మదేహ భేదేన దేహాత్మత్వం నివారితం ।
ఇదానీ దేహభేదస్య హ్యసత్త్వం స్ఫుట ముచ్యతే ॥

ఈ విధంగా, ఆత్మకి, దేహానికి భేదాన్ని వివరించి చెప్పడం వల్ల, దేహమే ఆత్మ అనుకునే అజ్ఞాన భావం కలిగి ఉండడం తప్పుగా నిరూపించబడింది. ఇప్పుడు ఆ రెండింటికీ, అంటే, ఆత్మకీ దేహానికి వ్యక్తం చేయబడిన భేదమంతా అసత్యమైనదేనని స్పష్టంగా చెప్పబడుతోంది.

(43)

చైతన్యస్యైకరూపత్వాద్భేదో యుక్తో న కర్హిచిత్ ।
జీవత్వం చ మృషా జ్ఞేయం రజ్జౌ సర్పగ్రహో యథా॥

ఆత్మ చైతన్యం ఎప్పుడూ ఏకైక స్వరూపమే. సర్వస్వమూ అదే అయి వుంది కనుక, దానిలో ఏ కాలంలోనూ భేద భావాలకు తావు లేదు. జీవుడి వ్యక్తిత్వం కూడా అసత్యమైన భ్రాంతిభావమే. ఈ భేదత్వమంతా తాడును చూసి పామనుకొని భ్రమించడం వంటిదని గ్రహించుకోవాలి.

(44)

రజ్జ్వజ్ఞానాత్ క్షణేనైవ యద్వద్రజ్జుర్హి సర్పిణీ ।
భాతి తద్వచ్చితి స్సాక్షాత్ విశ్వాకారేణ కేవలా ॥

నిజంగా ఇది తాడే అనే యదార్థ జ్ఞానం లేకపోవడం వల్ల, ఆ క్షణంలో ఆ తాడు ఏ విధంగా పాముగా తోస్తోందో, అలాగే శుద్ధ చైతన్య స్వరూపమైన ఆత్మను ఎంత మాత్రం తెలియక పోవడం వల్ల, అది ఏ మార్పూ చెందకుండానే దృశ్య ప్రపంచాకారంగా భాసిస్తోంది.

(45)

ఉపాదానం ప్రపంచస్య బ్రహ్మణోఽన్యన్న విద్యతే ।
తస్మాత్సర్వ ప్రపంచోఽయం బ్రహ్మైవాస్తి న చేతరమ్ ॥

ఈఅద్భుతమైన దృశ్యజగత్తుకంతటికి బ్రహ్మం తప్ప ఇతరమైన కారణమేదీ ఎక్కడా లేదు. అందు చేత ఈ సమస్త ప్రపంచమూ బ్రహ్మమే కాని మరేదీ కాదు.

(46)

వ్యాప్యవ్యాపకతా మిథ్యా సర్వమాత్మేతి శాసనాత్ ।
ఇతి జ్ఞాతే పరేతత్త్వే భేదస్యావసరః కుతః ॥

ఈ విధంగా సర్వమూ బ్రహ్మస్వరూపమేనని, బ్రహ్మం తప్ప మరేదీ లేదని శ్రుతులు నిర్ధారణ చేసి చెబుతూంటే, వ్యాప్యత్వము, వ్యాపకత్వము అనేవి మిథ్యాలోచనలే అవుతాయి. ఈ పరతత్వం గ్రహించ కలుగుతే, ఇక భేదభావానికి అవకాశమెక్కడుంటుంది?

(47)

శ్రుత్యా నివారితం నూనం నానాత్వం స్వముఖేన హి ।
కథం భాసో భవేదన్యః స్థితే చాద్వయ కారణే ॥

బ్రహ్మంలో అనేకత్వం లేదని స్పష్టంగా శ్రుతి తన ముఖస్తంగానే సూటిగా చెబుతోంది. ఇలా శాస్త్ర

రీత్యా బ్రహ్మం అద్వితీయమని నిస్సందేహంగా నిర్ణయింపబడి వుండగా, దానికి విరుద్ధంగా ఈ దృశ్య జగత్తు బ్రహ్మానికి అన్యంగా వేరే ఎలా ఉండగలదు? సత్యస్వరూపమైన బ్రహ్మ మొక్కటే ఉంటున్నదని ఈదృశ్య గోచర ప్రపంచమంతా వట్టి మిథ్యా స్వరూపమని భావం.

(48)

దోషోపి విహితః శ్రుత్యా మృత్యోర్మృత్యుం సగచ్ఛతి।
ఇహ పశ్యతి నానాత్వం మాయయా వంచితో నరః ॥

ఇదీకాక, మాయాప్రభావంవల్ల వంచితుడైన మానవుడు, అద్వయము, ఏకైక స్వరూపము అయి వున్న బ్రహ్మంలో అనేకత్వాన్ని చూస్తూ మళ్ళీ, మళ్ళీ జనన మరణాలతోకూడిన సంసార భ్రాంతిలో చిక్కుకుంటున్నాడనే దోషాన్ని కూడా శ్రుతి నిందా పూర్వకంగా చెబుతోంది.

(49)

బ్రహ్మణః సర్వభూతాని జాయతే పరమాత్మనః।
తస్మాత్ ఎతాని బ్రహ్మైవ భవంతీ త్యవధారయేత్ ॥

పరమాత్మ స్వరూపమైన బ్రహ్మం నుంచే సమస్తచరాచర భూతాలూ ఉద్భవిస్తున్నాయి. కనుక, అన్నీ తప్పక ఆ బ్రహ్మస్వరూపమే అవుతాయని అవగాహన చేసుకుని, నిర్ధారణ చేసుకోవాలి.

(50)

బ్రహ్మైవ సర్వనామాని, రూపాణి, వివిధాని చ,
కర్మాణ్యపి సమగ్రాణి బిభర్తీతి శృతిర్జగౌ॥

సర్వవిధాలైన ఈ సమస్త నామరూపాలకీ, కర్మకలాపాలకీ బ్రహ్మమే మూలమై వుందని శ్రుతి సుస్పష్టంగా చెబుతోంది.

(51)

సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వం శాశ్వతం।
బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథాభవేత్॥

బంగారంతో తయారైన వస్తువులన్నీ ఎలా ఎప్పుడూ బంగారమే అయివున్నట్లు, బ్రహ్మం వల్ల పుట్టిన ఈ సర్వచరాచర సృష్టిపరంపరా ఎల్లప్పుడూ బ్రహ్మమే అయి వుంది.

(52)

స్వల్ప మప్యంతరం కృత్వా జీవాత్మ పరమాత్మనోః॥
యః సంతిష్ఠతి మూఢాత్మా భయం తస్యాభిభాషితమ్॥

జీవాత్మకీ, పరమాత్మకీ అతి స్వల్పమైన భేదాన్నైనా ఏ మూఢమానవుడు అజ్ఞానంవల్ల భావిస్తున్నాడో, అటువంటివాడికి భయం ఆవహిస్తుందని కూడా చెప్పబడింది.

(53)

యత్రాజ్ఞానా ద్భవే ద్ద్వైత మిత రస్తత్ర పశ్యతి
ఆత్మత్వేన యదా సర్వం నేతర స్తత్ర చాణ్వపి॥

అజ్ఞానం వల్ల ద్వైతభావం ఎప్పుడు సంక్రమిస్తుందో, అప్పుడు తనకు భేదబుద్ధికలిగి ఇతరులు, ఇతరాలు గోచరిస్తాయి. కాని, ఎప్పుడు జ్ఞానోదయమై సర్వమూ సత్యస్వరూపమైన ఆత్మగా భాసిస్తుందో, అప్పుడు భేదభ్రాంతి నశించడంచేత తాను, ఇతరము అనే భిన్న దృష్టి ఎంతమాత్రమూ వుండదు.

(54)

యస్మిన్ సర్వాణి భూతాని హ్యాత్మత్వేన విజానతః,
నవై తస్య భవేన్మోహో నచ శోకో ద్వితీయత ః॥

ఈ రీతిగా సర్వచరాచర భూతాలనూ ఆత్మ స్వరూపంగా అనుభవజ్ఞానంతో ఎవడు తెలుసుకుంటున్నాడో, వాడికి, తనకి అన్యంగా ద్వితీయమైనదేదీ లేకపోవడంచేత, మోహంకాని, దుఃఖంకాని ఉండదు.

(55)

అయం ఆత్మాహి బ్రహ్మైవ సర్వాత్మకతయాస్థితః।
ఇది నిర్ధారితః శ్రుత్యా బృహదారణ్య సంస్థయా॥

అద్వితీయమైన ఈ సర్వాత్మస్థితి ఏదైతే ఎల్లప్పుడూ ఉంటున్నదో, అదే బ్రహ్మస్వరూపమని బృహదారణ్యకోపనిషత్తు ఇత్యాది శ్రుతులు నిర్ధారణ చేసి చెబుతున్నాయి.

(56)

అనుభూతోప్యయంలోకో వ్యవహారక్షమోపి సన్।
అసద్రూపో యథా స్వప్నః ఉత్తరక్షణ బాధిత ః॥

వ్యావహారికంగా, అన్ని విధాలా, ఈ ప్రపంచ విషయాలన్నీ అనుభవించబడుతున్నట్లు అనిపిస్తు న్నప్పటికీ, అది మరుక్షణంలో బాధింపబడుతోంది కాబట్టి, అదంతా స్వప్నంలాంటి అసద్రూపమైన మిథ్యయే.

(57)

స్వప్నో జాగరణేఽలీకః స్వప్నేఽపి నహిజాగరః ।
ద్వయమేవ లయే నాస్తి లయోఽపి హ్యుభయోర్నచ ॥

మెలకువ అనబడే జాగ్రదావస్థ రాగానే స్వప్నంలోని దృశ్యజాతమంతా అదృశ్యమై అంత రిస్తుంది. అలాగే స్వప్నంలో ఈ జాగ్రదావస్థ అంతా మాయమై లేనిదే అవుతుంది. ఈ జాగ్రత్, స్వప్నావ స్థలు రెండూ సుషుప్తిలో (గాఢనిద్రలో) లేవు. సుషుప్తి ఆ రెండవస్థలలో (జాగ్రత్ స్వప్నావస్థలలో) లేదు

(58)

త్రయమేవం భవేన్మిథ్యా గుణత్రయ వినిర్మితం ।
అస్యద్రష్టా గుణాతీతో నిత్యోహ్యేకః చిదాత్మకః ॥

ఈ విధంగా జాగ్రత్, స్వప్న సుషుప్త్యావస్థలు మూడూ, సత్వ రజ, స్తమో గుణాలవల్ల కల్పితమైన మిథ్యా స్వరూపాలు తప్ప సత్యమైనవికావు, కానీ, ఆ మూడు అవస్థలకూ వెనక వాటికి సాక్షీమాత్రుడై ఉంటున్న ఆత్మ గుణాతీతుడు, నిత్యుడు, ఏకైక స్వరూపుడు అయిన చైతన్యమాత్రుడు.

(59)

యద్వన్మృది ఘట భ్రాంతిం శుక్తౌ వారజ తస్థితిం ।
తద్వ ద్బ్రహ్మణి జీవత్వం వీక్ష్యమాణే న పశ్యతి ॥

ఈ మిథ్యాభావం తొలగిన తరువాత మట్టితో తయారై (మట్టే) అయివున్న దానిని కుండగాను, ముత్యపుచిప్ప అయివున్న దానిని వెండిగాను అను కుంటూ ఎలా భ్రమ చెందడో. అలాగే ఏకైక సర్వ స్వరూపుడైన బ్రహ్మంలో పరిచ్ఛిన్నమైతోచే జీవ భ్రాంతి వదలినవాడై, సమస్తమూ చైతన్య స్వరూప మైన బ్రహ్మమేనని. ఆ బ్రహ్మం తానేఅయివున్నా దని తెలివి కలగడంవల్ల ఇక జీవబ్రహ్మ విభేదాన్ని చూడడు.

(60)

యథా మృది ఘటోనామ కనకే కుండలాభిధా ।
శుక్తౌహి రజత ఖ్యాతిః జీవ శబ్దః తథాపరే ॥

ఎలా మట్టితో తయారుచేయబడి మట్టే అయి వున్న దానిని కుండ అనే పేరుతోను బంగారంతో తయారై బంగారమే అయివున్న దానిని కుండలమనే పేరుతోను, ముత్యపుచిప్పను చూసి భ్రమవలన దానిని వెండి అనే భావంతోను వ్యవహరిస్తున్నారో ఆ విధంగానే యదార్థంగా బ్రహ్మయే అయివున్న దానిని, జీవుడు అనే భ్రాంతిభావంతో వ్యవహరిస్తు న్నారు,

(61)

యథైవ వ్యోమ్ని నీలత్వం యథానీరం మరుస్థలే ।
పురుషత్వం యథా స్థాణౌ తద్వ ద్విశ్వం చిదాత్మని ॥

శూన్యమైన ఆకాశం నీలవర్ణం కలిగి ఉన్న దని, ఎండమావిని నీరని, చెట్టుమోడును మనిషి అని ఎలా భ్రాంతిచే అపోహపడుతున్నారో అలాగే అజ్ఞాన

దోషంవల్ల అనంతమైన చిదాత్మ స్వరూపంలో ఈ దృశ్య జగత్తు ఉన్నట్లు భ్రమించిపోతున్నారు. అంటే నిజంగా ఈ ప్రపంచం భ్రమ కల్పితమే కాని యదార్థం కాదని తెలియచెప్పడం.

(62)

యథైవ శూన్యే వేతాళో గంధర్వాణాం పురం యథా ।
యథాకాశే ద్విచంద్రత్వం తద్వత్ సత్యే జగత్ స్థితిః ॥

భ్రమ చేత శూన్యప్రదేశంలో భూతమున్నట్లు, శూన్యమైన ఆకాశంలో గంధర్వ పుర మున్నట్లు, రెండు చంద్రులు ఆకాశంలో ఉన్నట్లు, ఎలా అపోహ పడతారో, ఆ విధంగానే అజ్ఞానం వల్ల బ్రహ్మంలో ఈ కల్పిత దృశ్య జగత్తు ఉన్నట్లు భ్రమించి పోతున్నారు.

(63)

యథా తరంగ కల్లోలైర్జలమేవ స్ఫురత్యలమ్ ।
పాత్ర రూపేణ తామ్రం హి బ్రహ్మాండౌఘైస్తథాఽత్మతా॥

నీటిలో చెలరేగే కెరటాలు, సుడిగుండాలు మొదలైన కల్లోలాలతో గోచరించేదంతా నీరేకాని వేరేదీకానట్లు, వివిధ పాత్రల రూపంతో కనబడేదంతా రాగేతప్ప ఇతరమేమీ అయివుండనట్లు, ఈ ఇంద్రియ గోచర బ్రహ్మాండమంతా ఆత్మస్వరూపమే కాని ఆత్మేతరమేదీ కాదు.

(64)

ఘట నాత్మ యథా పృథ్వీ పటనాత్మా హి తంతవః ।
జగన్నామ్నా చిదాభాతి జ్ఞేయంతత్తద భావతః ॥

మట్టే కుండ అనే పేరుతో ఏ విధంగా గోచరిస్తోందో, నూలుపోగులే వస్త్రం అనే పేరుతో ఎలా వ్యవహరింప బడుతున్నాయో, ఆ ప్రకారంగానే సత్ చిదానందమయమైన ఆత్మస్వరూపమే జగత్తుగా నామరూపాలతో భాసిస్తోంది. ఆ నామరూపాలను వివేక, తత్వవిచారణ సాధనలతో తొలగించుకుని ఆత్మపదార్థాన్ని అనుభూతి పొందాలి.

(65)

సర్వోఽపి వ్యవహారస్తు బ్రహ్మణా క్రియతే జనైః ।
అజ్ఞానాత్ న విజానంతి మృదేవహి ఘటాదికమ్ ॥

కుండలు. మొదలైన మృణ్మయ వస్తువులన్నీ మట్టేకాని వేరేదీకాదని అజ్ఞానంవల్ల ఎలా తెలియలేక పోతున్నారో, అలాగే మనుష్యులు సమస్త కార్య కలాపాలూ బ్రహ్మంలోనే బ్రహ్మమువల్లనే చేస్తున్న ప్పటికీ (అ)జ్ఞానకారణంవలన, దానిని తెలుసుకోలేక పోతున్నారు.

(66)

కార్యకారణ తయానిత్యం ఆస్తే ఘట మృదోః యథా ॥
తథైవ శ్రుతి యుక్తిభ్యాం ప్రపంచ బ్రహ్మణోరిహ ॥

కుండ తయారు చెయ్యడానికి మట్టికారణం కాబట్టి, కుండకీ, మట్టికీ ఎల్లప్పుడూ కార్య కారణ సంబంధం ఎలా ఉన్నదో, అలాగే ఈ దృశ్య ప్రపం చానికీ, బ్రహ్మనికీ అటువంటి సంబంధమే వున్నది. ఈ విషయాన్ని శ్రుతి, యుక్తుల ఆధారంగా నిశ్చ యించడం జరిగింది.

(67)

గృహ్యమాణే ఘటే యద్వత్ మృత్తికా యాతి వైబలాత్।
వీక్ష్యమాణే ప్రపంచేపి బ్రహ్మైవాభాతి భాసరమ్॥

ఘటాన్ని గురించిన ఆలోచనరాగానే వెంటనే మట్టి ఏ విధంగా మనస్సులోకి వస్తుందో, అలాగే ఈ నానాకారదృశ్య ప్రపంచాన్ని వీక్షిస్తుంటే నిత్య నిరంతర ప్రకాశమైన బ్రహ్మమే భాసిస్తుంది.

(68)

సదైవాత్మా విశుద్ధోస్తి హ్యశుద్ధో భాతివై సదా॥
యథైవ ద్వివిధా రజ్జుః జ్ఞానినోఽజ్ఞానినోఽనిశమ్॥

భేద దృష్టివల్ల తాడు జ్ఞానికి, అజ్ఞానికి రెండు విధాలుగా గోచరిస్తుంది. అజ్ఞానికి భ్రాంతివల్ల చీకట్లో తాడు పాములా కనిపించి, కలవర పెడుతుంది. అది తాడేకాని పాముకాదని తెలిసివున్న జ్ఞాని, చీకట్లో దానిని చూసినా ఎంతమాత్రమూ కలవర పడడు. అలాగే, జ్ఞానికి ఏకైక స్వరూపమైవున్న ఆత్మ ఎల్లప్పుడూ విశుద్ధమై గోచరిస్తుంది. కాని అజ్ఞానికి

ఇదే ఆత్మ నానావికార నామరూపాలతో అశుద్ధంగా కనబడుతుంది.

(69)

యథైవ మృణ్మయః కుంభ స్తద్వద్దేహోపి చిన్మయః
ఆత్మానాత్మ విభాగోయం ముధైవక్రియతే బుధైః॥

నామ రూపాలుగల కుండ అంతా ఎలా మట్టిమయమో, అలాగే నామరూపాత్మకమైన ఈ దేహమంతా ఆత్మచైతన్యమే. ఆధ్యాత్మికులు, ఇంకా ద్వైత భావంతోకూడిన అజ్ఞానంలోనే వుండడంవల్ల, ఆత్మానాత్మ విభాగాన్ని అనవసరంగా చేస్తున్నారు. అంతిమలక్ష్యమైన అద్వైతజ్ఞానం ఉదయించడంతోనే ఈ విభేదదృష్టి అంతమై "సర్వం బ్రహ్మమయం జగత్" అనే అభేద దృష్టి కలుగుతుంది.

(70)

సర్పత్వేన యథారజ్జుః రజతత్వేన శుక్తికా।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మనా॥

తాడునుచూసి పామనుకొని, ముత్తెపుచిప్పను గాంచి వెండి అనుకొని, ఎలా మూఢుడైనవాడు అపోహపడుతున్నాడో, అలాగే అజ్ఞానంతోవున్న మూఢమానవుడు ఆత్మస్వరూపమైవున్న తనను తన శరీరంగా అన్వయించుకుని దేహాత్మబుద్ధితో ఉంటు న్నాడు.

(71)

ఘటత్వేన యథా పృథ్వీ పటత్వేనైవ తంతవః।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మనా॥

మూఢుడు మట్టిని కుండగాను, నూలుపోగు లను వస్త్రంగాను ఏ విధంగా అనుకుంటున్నాడో, అలాగే అజ్ఞానంలోవున్న మూఢమానవుడు ఆత్మ స్వరూపమైవున్న తనను, తన శరీరంగా అన్వయించు కుని దేహాత్మబుద్ధితో ఉంటున్నాడు.

(72)

కనకం కుండలత్వేన తరంగత్వేన వై జలమ్।
వినిర్ణీతం విమూఢేన దేహత్వేన తథాత్మతా॥

మూఢుడు బంగారాన్ని కుండలంగాను, నీటిని కెరటంగాను ఏవిధంగా అనుకుంటున్నాడో, అలాగే అజ్ఞానంలోవున్న మూఢమానవుడు ఆత్మస్వరూపమై ఉన్న తనను తన శరీరంగా అన్వయించుకుని దేహాత్మభావంతో ఉంటున్నాడు.

(73)

పురుషత్వేన వైస్థాణు ర్జలత్వేన మరీచికా।
వినిర్ణీతా విమూఢేన దేహాత్వేన తథాత్మతా॥

చీకటిలో కొమ్మలులేని చెట్టుయొక్క మ్రానును (మోడు)చూసి మనిషిగాను, ఎండమావిని చూసి జలముగాను ఏవిధంగా భ్రమవల్ల అనుకుంటున్నాడో, అలాగే అజ్ఞానంచేత మూఢమానవుడు ఆత్మ స్వరూపమైవున్న తనను తన శరీరంగా అన్వయించుకుని, దేహాత్మభావంతో ఉంటున్నాడు.

(74)

గృహత్వేనైవ కాష్ఠాని ఖడ్గత్వేనైవ లోహతా।
వినిర్ణీతా విమూఢేన దేహాత్వేన తథాత్మతా॥

కఱ్ఱల సమూహాన్ని (కఱ్ఱలతో కట్టబడిన దానిని) గృహంగాను, లోహాన్ని (ఇనుము మొదలైన లోహాలతో తయారు కాబడినదానిని) ఖడ్గంగాను ఏవిధంగా అనుకుంటున్నాడో, అలాగే అజ్ఞానంలో వున్న మూఢమానవుడు, ఆత్మస్వరూపమైనటువంటి తనను శరీరంగా అన్వయించుకుని దేహాత్మబుద్ధితో ఉంటున్నాడు.

(75)

యథా వృక్ష విపర్యాసో జలాత్ భవతి కస్యచిత్
తద్వత్ ఆత్మని దేహాత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥

నీటిలో ప్రతిబింబించిన వృక్షాన్ని చూసి, ఆ వృక్షం తల్లక్రిందులుగా వుందని ఎలా భావిస్తున్నాడో, అలాగే అజ్ఞానంవల్ల ఆత్మను దేహమనుకుని అపోహపడి పోతున్నాడు.

(76)

పోతేవగచ్ఛతః పుంసః సర్వం భాతీవ చంచలమ్
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః॥

పడవలో ప్రయాణించేసే వాడికి. తాను కదలకపోయినా చుట్టుప్రక్కల అన్నీ కదిలిపోతున్నట్లు ఏ విధంగా కనపడతాయో, ఆ విధంగానే, అజ్ఞానం వల్ల ఆత్మని దేహమనుకుని భ్రమపడిపోతున్నాడు.

(77)

పీతత్వం హి యథా శుభ్రే దోషాద్భవతి కస్యచిత్।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

పచ్చకామెర్లరోగం సంక్రమించినవాడికి తెల్లని వస్తువులు పసుపుపచ్చగా కనపడునట్లు. అజ్ఞాన దోషంవల్ల ఆత్మస్వరూపాన్ని దేహమనుకుని భ్రమ పడి పోతున్నాడు.

(78)

చక్షుర్భ్యాం భ్రమశీలాభ్యాం సర్వంభాతి భ్రమాత్మకం।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

కంటిదోషంవల్ల కళ్ళు తిరుగుతున్న వాడికి చుట్టుప్రక్కల అంతాకూడా తిరిగిపోతున్నట్లే కన

(83)

యద్వదగ్నౌ మణిత్వంహి మణౌ వా వహ్నితా పుమాన్ ।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన దోషతః ॥

మణిలో అగ్ని ఉన్నట్లు, అగ్నిలో మణి ఉన్నట్లు భ్రాంతి చేత ఎలా అపోహ పడుతున్నారో, ఆదే విధంగా, అజ్ఞానం వల్ల ఆత్మస్వరూపాన్ని దేహ మనుకుని భ్రమ జెందుతున్నారు.

(84)

అభ్రేషు సత్సుధావత్సు సోమో ధావతి భాతివై ।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః ॥

ఆకాశంలో మేఘాలు కదిలిపోతూంటే, చంద్రుడు కదిలిపోతున్నట్లు ఏ విధంగా కనిపిస్తోందో అలాగే అజ్ఞాన ప్రభావం వల్ల, ఆత్మ స్వరూపం దేహ మనుకునే అపోహ కలుగుతోంది.

(85)

యథైవ దిగ్విపర్యాసో మోహాద్భవతి కస్యచిత్ ।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః ॥

(81)

సూక్ష్మత్వే సర్వ భావానాం స్థూలత్వం చోపనేత్రతః।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥

భూతద్దాలు పెట్టుకున్న కళ్ళతో చూస్తే చిన్న చిన్న వస్తువులు ఏ విధంగా ఎంతెంతో పెద్దవిగా కనిపిస్తాయో, ఆ విధంగా అజ్ఞానం చేత ఆత్మస్వరూపాన్ని దేహమనుకుని అపోహ పడుతున్నారు.

(82)

కా చ భూమౌ జలత్వం వా జలభూమౌ హి కాచతా
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞాన యోగతః ॥

సూర్యకిరణాల వల్ల, గాజుతో పరచబడిన నేలను చూసి అది నీరు గాను, అదేవిధంగా, జలంతో వున్న భూమిని చూసి అది గాజుగాను అపోహ పడినట్లు, అజ్ఞానం వల్ల, ఆత్మ స్వరూపాన్ని దేహమనుకుని భ్రమ పడుతున్నారు.

(83)

యద్వదగ్నౌ మణిత్వంహి మణౌవా వహ్నితా పుమాన్
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన దోషతః ॥

మణిలో అగ్ని ఉన్నట్లు, అగ్నిలో మణి ఉన్నట్లు భ్రాంతి చేత ఎలా అపోహ పడుతున్నారో, ఆదే విధంగా, అజ్ఞానం వల్ల ఆత్మస్వరూపాన్ని దేహ మనుకుని భ్రమ జెందుతున్నారు.

(84)

అభ్రేషు సత్సుధావత్సు సోమో ధావతి భాతివై ।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞాన యోగతః ॥

ఆకాశంలో మేఘాలు కదిలిపోతూంటే, చంద్రుడు కదిలిపోతున్నట్లు ఏ విధంగా కనిపిస్తోందో అలాగే అజ్ఞాన ప్రభావం వల్ల, ఆత్మ స్వరూపం దేహ మనుకునే అపోహ కలుగుతోంది.

(85)

యద్దైవ దిగ్విపర్యాసో మోహాద్భవతి కస్యచిత్ ।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞాన మోహతః ॥

(81)

సూక్ష్మత్వే సర్వ భావానాం స్థూలత్వం చోపనేత్రతః।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥

భూతద్దాలు పెట్టుకున్న కళ్ళతో చూస్తే చిన్న చిన్న వస్తువులు ఏ విధంగా ఎంతెంతో పెద్దవిగా కనిపిస్తాయో, ఆ విధంగా అజ్ఞానం చేత ఆత్మస్వరూపాన్ని దేహమనుకుని అపోహ పడుతున్నారు.

(82)

కా చ భూమౌ జలత్వం వా జలభూమౌ హి కాచతా
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞాన యోగతః ॥

సూర్యకిరణాల వల్ల, గాజుతో పరచబడిన నేలను చూసి అది నీరు గాను, అదేవిధంగా, జలంతో వున్న భూమిని చూసి అది గాజుగాను అపోహ పడినట్లు, అజ్ఞానం వల్ల, ఆత్మ స్వరూపాన్ని దేహమనుకుని భ్రమ పడుతున్నారు.

ప్రారబ్ధ కర్మ నిలవదు. మెలకువ వచ్చిన వెంటనే స్వప్నము ఉండనట్లు, జ్ఞానోదయమైన తోడనే శరీర ప్రపంచాదుల భ్రాంతి పూర్తిగా తొలగిపోతుంది. శరీరాదులే లేనప్పుడు, ఇక ప్రారబ్ధ కర్మానికి తావెక్కడ?

(92)

కర్మ జన్మాంత రీయం యత్ ప్రారబ్ధమితి కీర్తితమ్ ।
తత్తు జన్మాం తరాభావాత్ పుంసో నైవాస్తి కర్హిచిత్ ॥

కిందటి జన్మలో చెయ్యబడిన కర్మాన్ని ప్రారబ్ధమని అంటారు. ఆ కర్మ పరిణామమే ఇప్పటి జీవితం. జ్ఞాని అహంకార రహితుడు, జన్మమేలేని వాడు కనుక, ఆయనకు ప్రారబ్ధమనేది ఎంత మాత్రమూ సంభవింపదు.

(93)

స్వప్నదేహో యథాధ్యస్త స్తథైవాయం హిదేహకః ।
అధ్యస్తస్య కుతో జన్మ జన్మాభావే హి తత్ కుతః ॥

నీ కాలాన్ని ఎల్లప్పుడూ నిరంతరం, నిరంతరాయంగా ఆత్మ విచారణలోనే గడుపు. ప్రారబ్ధకర్మల వల్ల సంభవించే ఫలితాల్ని అనుభవిస్తూ, దానివల్ల ఎటు వంటి ఉద్వేగాన్నీ పొందకు.

(90)

ఉత్పన్నే ప్యాత్మ విజ్ఞానే ప్రారబ్ధం నైవ ముంచతి ।
ఇతియన్ శ్రూయతే శాస్త్రాత్ తత్ నిరాక్రియతే ధునా ॥

ఆత్మజ్ఞానం ఉత్పన్నమైన తరువాత కూడా ప్రారబ్ధకర్మల ప్రభావం విడువదని వేదాంతశాస్త్రాలలో వినబడే సిద్ధాంతం ఇప్పుడు తిరస్కరింపబడుతోంది.

(91)

తత్వ జ్ఞానోదయా దూర్ధ్వం ప్రారబ్ధం నైవ విద్యతే ।
దేహాదీనా మసత్వాత్తు యథా స్వప్నో విబోధత ॥

దేహమే తాను అనుకునే దేహాత్మ భ్రాంతి తొలగిపోయి. తత్వజ్ఞానోదయం కలిగిన పిమ్మట,

ప్రారబ్ధ కర్మ నిలవదు. మెలకువ వచ్చిన వెంటనే స్వప్నము ఉండనట్లు, జ్ఞానోదయమైన తోడనే శరీర ప్రపంచాదుల భ్రాంతి పూర్తిగా తొలగిపోతుంది. శరీరాదులే లేనప్పుడు, ఇక ప్రారబ్ధ కర్మానికి తావెక్కడ?

(92)

కర్మ జన్మాంత రీయం యత్ ప్రారబ్ధమితి కీర్తితమ్ ।
తత్తు జన్మాంతరాభావాత్ పుంసో నైవాస్తి కర్హిచిత్ ॥

కిందటి జన్మలో చెయ్యబడిన కర్మాన్ని ప్రారబ్ధమని అంటారు. ఆ కర్మ పరిణామమే ఇప్పటి జీవితం. జ్ఞాని అహంకార రహితుడు, జన్మమేలేని వాడు కనుక, ఆయనకు ప్రారబ్ధమనేది ఎంత మాత్రమూ సంభవింపదు.

(93)

స్వప్నదేహో యథాధ్యస్త స్తథై నాయం హిదేహకః ।
అధ్యస్తస్య కుతో జన్మ జన్మాభావే హి తత్ కుతః ॥

నీ కాలాన్ని ఎల్లప్పుడూ నిరంతరం, నిరంతరాయంగా ఆత్మ విచారణలోనే గడుపు. ప్రారబ్ధకర్మల వల్ల సంభవించే ఫలితాల్ని అనుభవిస్తూ, దానివల్ల ఎటు వంటి ఉద్వేగాన్నీ పొందకు.

(90)

ఉత్పన్నే ప్యాత్మ విజ్ఞానే ప్రారబ్ధం నైవ ముంచతి ।
ఇతియచ్ ఛ్రూ యతే శాస్త్రాత్ తత్ నిరాక్రియతే ధునా ॥

ఆత్మజ్ఞానం ఉత్పన్నమైన తరువాత కూడా ప్రారబ్ధకర్మల ప్రభావం విడువదని వేదాంతశాస్త్రా లలో వినబడే సిద్ధాంతం ఇప్పుడు తిరస్కరింపబడు తోంది.

(91)

తత్వ జ్ఞానోదయా దూర్ధ్వం ప్రారబ్ధం నైవ విద్యతే ।
దేహాదీనా మసత్వాత్తు యథా స్వప్నో విబోధత ॥

దేహమేతాను అనుకునే దేహాత్మ భ్రాంతి తొలగిపోయి, తత్వజ్ఞానోదయం కలిగిన పిమ్మట,

భ్రాంతివల్ల, అది తాడు అనే యదార్థ పరిజ్ఞానాన్ని విడిచిపెట్టి, దాన్ని పాముగాను ఏ విధంగా అపోహపడుతున్నాడో, అలాగే మూఢుడైన అజ్ఞాని సత్యస్వరూపమైన పరమార్థాన్ని తెలుసుకోలేక, మిథ్యాస్వరూపమైన ప్రపంచాన్ని చూస్తున్నాడు.

(96)

రజ్జురూపే పరిజ్ఞాతే సర్పఖండం నతిష్ఠతి
అధిష్ఠానే తథాజ్ఞాతే ప్రపంచ శ్శూన్యతాం గత ॥

ఇది తాడేనన్న పరిజ్ఞానం కలిగిన పిమ్మట ఇక సర్పరూప భ్రాంతి ఎంత మాత్రమూ వుండదు. అలాగే అధిష్ఠాన పరమాత్మ స్వరూపం అనుభూతి చెందిన వెంటనే దృశ్య ప్రపంచమంతా తనలోనే లయించి సూన్యమే అవుతుంది.

(97)

దేహస్యాపి ప్రపంచత్వాత్ ప్రారబ్ధావ స్థితిః కుతః।
అజ్ఞాని జనబోధార్థం ప్రారబ్ధం వక్తివై శ్రుతి ॥

దేహంకూడా మిథ్యాస్వరూపమైన ప్రపంచం లోనిదే కాబట్టి, దేహానికి సంబంధించిన ప్రారబ్ధం ఇక ఎలా వుండగలదు? అజ్ఞానులైన జనులకు తత్వాన్ని బోధించడంకోసం శ్రుతి ప్రారబ్ధాన్ని గురించి చెబుతోంది.

(98)

క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ।
బహుత్వం తన్నిషేధార్థం శ్రుత్యా గీతం చ యత్ స్ఫుటమ్॥

"కార్య కారణాలతో వున్న అన్ని ద్వంద్వాలలోనూ గోచరించే ఆ పరమాత్మను సాక్షాత్కరించుకున్న మీదట అన్ని కర్మలూ క్షయించి పోతాయి." అన్న శ్రుతి (ముండకోపనిషత్తు), అజ్ఞానియొక్క బోధకోసం చెప్పబడిన ప్రారబ్ధాన్ని కూడా నిషేధించడానికి "కర్మాణి" అని బహు వచనం ఉపయోగిస్తూ స్పష్టంగా విశదపరచింది.

(99)

ఉచ్యతే జ్ఞైర్బలా చ్చైతత్ తదానర్థ ద్వయాగమః ।
వేదాంత మతహానంచ యతోజ్ఞానం ఇతి శ్రుతిః ॥

శ్రుతి ఇలా స్పష్టం చేసినప్పటికీ, అజ్ఞానులు ఈ ప్రారబ్ధం అనేది బ్రహ్మజ్ఞానం పొందిన మహనీయుడికూడా తప్పదని పట్టుదలతో వాదిస్తే, వాళ్ళు, పునర్జన్మ, మోక్షం అనేది లేక పోవడం అనే రెండు అనార్థాల్ని ఎదుర్కోవలసి వస్తుంది, అటువంటిది, యదార్థమైన వేదాంత సిద్ధాంతానికి అద్వైతానికి విరుద్ధమైన పరిస్థితి. అందుచేత శ్రుతులలో ప్రతిపాదింప బడినట్లు, జ్ఞాన స్వరూపమైన బ్రహ్మం ఒక్కటే పరమార్థ సత్యమని గ్రహించుకోవాలి.

(100)

త్రివందాగాన్యథో పక్షే పూర్వోక్త స్యహానిర్బ్ధయే ।
తైశ్చ సర్వై సదా కార్యం నిదిధ్యాస సమేవతు ॥

